# శ్రీ మల్లికార్జున సుప్రభాతమ్

(ఆంధ్ర టీకాతాత్పర్యసహితము)



టీకాతాత్పర్య రచయిత :
ఉభయభాషాప్రవీణ, వేదాంతశిరోమణి,
సాహిత్యవిద్యాప్రవీణ, విద్వత్కవిశేఖర
**శ్రీ లంకా సీతారామశాస్త్రి**



ప్రచురణ :
**శ్రీశైలదేవస్థానము, శ్రీశైలము**
1967

 [వెల 30 పై.

# అరుణోదయము

దేవీం వాచ మ జన యన్త దేవాః తాం విశ్వరూపాః పశవోవదన్తి
సానో మంద్రేష మూర్జం దుహానా ధేను ర్వాగస్మా నుపసుష్టు తైతు.
(మంత్రః)

పాఠకమహాశయులారా !

మానవులందఱు గీర్వాణభాషను సహజభాషగా మాట్లాడఁగలిగిన నాఁడు - 'సా వాక్ ధేనుః ఊర్జందుహానా అస్మానుప సుష్టుతైతు' ఆ దైవీ వాక్కు - ధేనువుపాలనొసఁగి బలమును జేకూర్చినట్లు ఈ వాక్కు మానవులకు బలోత్సాహములఁ జేకూర్చును. అని పై మంత్రార్థము - కాఁగా మనము నిత్యనైమిత్తికాదులగు కర్మలలో నుపయోగించుభాష తెలుఁగర్థమున, నతి సులభమైనదయ్యు నాకర్మలవలనఁ బుట్టు నపూర్వమునకై వానిలో నుపయోగించుభాష గీర్వాణభాషగనే యుండవలయునని నిరుక్తము. అందుచే భగవన్నుత్యాత్మకములగు నీ సుప్రభాతాదులు గీర్వాణభాషలోఁ బఠించు టట్టి యపూర్వమును బుట్టించుటకే యనవలయును.

సాధారణముగ 'సుప్రభాతము' అనునవి నేటి దేవతారాధకులకుఁ దప్పనిసరి క్రమమైనది. అందులకే - వేంకటేశ్వర, భద్రాద్రిరామ, యాదగిరి నృసింహ, శ్రీశైలక్షేత్రములు మొదలగు ప్రసిద్ధస్థలములందలి దేవతలపై సుప్రభాతము లుత్పన్నములైనవి.

'సుప్రభాతము' అనుశబ్దము - భాతుం ప్రవృత్తం — ప్రభాతం - (కర్మణి క్తాంతము) కాఁగా సుష్ఠు ప్రభాతమ్ — సుప్రభాతము - అని. అనఁగా నీరోజున కారంభము మంచిదిగను, తేజోవంతముగ నుండునని యర్థము.

అంచుచే నో! స్వామీ! మాకుఁ దెల్లవారిన యీరోజు నీకును మాకు నుత్సాహకరమైనదని తాత్పర్యము. ఈభావార్థమునే, సుప్రభాతములం దెల్పుచున్నవి.

(కొన్ని) సుప్రభాతములందు - వానికిఁదోడు - స్తోత్రము, ప్రపత్తి, మంగళాశాసనము అను త్రికమును గలిపి చతుష్కముగఁ జూపిరి. ఇవి భక్తుల యాదరాశయములవలనఁ బెరిఁగిన వన వచ్చును. అనఁగాఁ బ్రథమమున భక్తుఁడు భగవంతుని మేల్కొలిపి, స్తుతించుటయు, ప్రసన్నుఁడగుటయు, నాపైని మంగళాశాసన మొనరించుటకు వారి భావక్రమ మనవచ్చును. ఆ యభిప్రాయముతోడనే వెలువడిన సుప్రభాతములన్నను, కేవల సుప్రభాతైకమాత్రములు కలవికొన్ని లేకపోలేదు. కాఁబట్టి యీ సుప్రభాతేతరములం సేవకులగు భక్తుల మనోభీష్టములననుసరించి కలుపుకొనఁబడ వచ్చినవి.

ప్రస్తుతమున శ్రీశైల శ్రీమల్లికార్జున సుప్రభాతగ్రంథమున-సుప్రభాతమ్, స్తోత్రమ్ ప్రపత్తిః, మంగళాశాసనమ్-అనునవి నాల్గును సంఘటితమై యున్నవి. కాని, యివి యే కారణమున నిట్లుకలిసినవో దానిని నేను కారణమునక శ్రీవారి చరణశరణాష్టకమును. ఇందుఁబొందుపఱచితిని. దానికి నా యీ యుపపత్తిని (కారణమును) వినుఁడు.

గుణదోషౌ బుధో గృహ్ణన్నిందు క్ష్వేళావివేశ్వరః
శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి.

అని యార్యోక్తిగదా?

శాంతం పద్మాసనస్థం శశిధరమకుటం పంచవక్త్రం త్రినేత్రమ్.

అని శివధ్యానము. శివునకుఁగల పంచముఖములలో దూర్పువైపుగల ముఖము తత్పురుషము, దక్షిణమున నఘోరము, పశ్చిమమున సద్యోజాతము, నుదఙ్ముఖము వామదేవము, ఊర్ధ్వమీశానము - అని మహాన్యాస

గ్రంథరావణోక్తి. ఈముఖములను బూజించుటలోఁ బ్రాగాదిగఁ బూజింప వలయుననియొకమతము. మఱియొక మతమున భక్తుఁడు శివార్చన కాలమున లింగమున కాగ్నేయమునఁగూడి తాను ప్రాఙ్ముఖుఁడై శివుని పశ్చిమముఖమగు సద్యోజాతము నుబ్రథమముగను, ఆటుపై, నుదఙ్ముఖమగు వామదేవమును, ఆ తరువాత దక్షిణ దిఙ్ముఖమగు నఘోరముఖమును, ఆపై నీశానమును బూజించు నాచారమునైన ట్టీ దిగువభాగము ప్రమాణము.

ప్రాచ్యాం తత్పురుష వింద్యా దఘోరం దక్షిణాముఖం
సద్యోజాతం ప్రతీచ్యాంతు వామదేవ ముదఙ్ముఖం.
ఈశాన మూర్ధ్వ వక్త్రంస్యా చ్ఛంభోః పంచముఖ క్రమః
లింగ స్యాగ్నేయ భాతస్థః ప్రాగాది ముఖమర్చయేత్.
ప్రతీచ్యాం ప్రాఙ్ముఖో భక్త్యా సద్యోజాతం సమర్చయేత్
వామదేవ మఘోరంచ తత స్తత్పురుషం తథా.
ఈశాన మర్చయే దేవం పూజాయాఁ భేద ఉచ్యతే.

(మహాన్యాసము)

దీనినిబట్టి - ప్రభాతము ప్రారంభమగుట తూర్పుదిక్కుననే యగుట వలన నీశ్వరప్రాఙ్ముఖమగు తత్పురుషాస్యముకడ సుప్రభాతమును, అఘోర వదనసన్నిధనిస్తోత్రమును, సద్యోజాతాననమునొద్దఁ బ్రపత్తియు, వామదేవ ముఖాంతికమున మంగళాశాసనమును, ఈశానో త్తమాంగ మూర్ధ్వమున నుండుటనుబట్టి దానికడ కేవలమాశంకరుని చరణమే శరణముగఁ బ్రార్థించుట సమంజసమనవచ్చునుగదా? కావున, నాయీకృషి ఫలవంతమై భక్తులచే నీడ్యమైన నేను కృతజ్ఞుఁడను. సుప్రభాతమున కరుణోదయమారంభమని విజ్ఞలోకము గ్రహించుననియే నా నిశ్చయము.

ఈ సుప్రభాతముపై నతిభక్తిశ్రద్ధలుగల్గి - శ్రీశైలదేవసన్నిధిని 'ఇంజనీరు'గఁ బనిచేయుచున్న శ్రీ మూక్కవెల్లి సన్న్యాసయ్యగారు - నాపాలిటికి దీనినప్పగించి నన్ను ధన్యునిఁజేయఁగాంచి - 'దీనికి, టీక, తాత్పర్యమును మీరు వ్రాసిపెట్టుఁడు' అనిరి; నేను నా విశ్రాంతిసమయమున దీనిని వ్రాసితిని - దానిని దేవస్థానము ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారగు శ్రీయుతులు పి. సీతారామయ్యగారు భక్తకోటికందించు నుద్దేశముతో ముద్రణము జేయించిరి. సర్వసుఖంకరుఁడైన యా శ్రీశైలవాసుఁడు తనకైంకర్యమున నుపయోగించు భక్తతతికి విశేషసంపదలిచ్చి ప్రోచుఁగాతమని యీశానున కనారతము నా నమోవాకములు.

—రచయిత.



శ్రీ భ్రమరాంబా మల్లికార్జున స్వామినే నమః

# శ్రీ మల్లికార్జున సుప్రభాతమ్

(టీకాతాత్పర్యసహితము)

## వినాయకస్మరణము

శ్లో. ప్రాత స్స్మరామి గణనాథ మనాథ బంధుం
సిందూర పూర పరిశోభిత గండ యుగ్మమ్,
ఉద్దండ విఘ్న పరిఖండన చండదండ
మాఖండ లాది సురనాయక బృంద వంద్యమ్.

టీక. అనాథబంధుమ్ = దిక్కులేని వారికి బంధువైనట్టియు; సిందూరపూర పరిశోభిత గండయుగ్మమ్ = చందిరమను శోభనద్రవ్యము యొక్క సమూహముచేఁ బ్రకాశించెడి చెక్కిళ్లు గలవాఁడును. ఉద్దండ....దండమ్:— ఉద్దండ = గొప్పవైన; విఘ్న = అంతరాయముల యొక్క; పరిఖండన = విచ్ఛేదమందు; చండదండమ్ = తీక్ష్ణశాసనము గలవాఁడును; ఆఖండల.... వంద్యమ్:— ఆఖండలాది = ఇంద్రుఁడు మొదలగు, సురనాయక = దేవశ్రేష్ఠుల యొక్క, బృంద = సమూహముచే, వంద్యమ్ = నమస్కరింపఁబడువాఁడునగు, గణనాథం = ప్రమథగణనాయకుఁడగు వినాయకుని; ప్రాతః = ఈ ప్రాతఃకాలమున, స్మరామి = నేను తలఁచుచున్నాను.

తా. దీనబంధువును, చందిరపుఁగాంతిచే చెలువొందు గండస్థలములు గల యేనుఁగు మోమువాఁడును, విఘ్నము లెంత లెంతవైన క్షణములోఁ బ్రచండశాసనమున నణఁచివేయువాఁడును, ఇంద్రాది దేవవంద్యుఁడునగు గణపతిని ఈ సుప్ర

భాతము నిర్విఘ్నమగుటకై ప్రాతఃకాలమున మొదట నేను మనస్సులో స్మరించుకొనుచున్నాను.

కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటిత ఫలాభ్యాం భవతుమే,
శివాభ్యా మస్తోక త్రిభువన శివాభ్యాం హృది పున
ర్భవాభ్యా మానంద స్ఫుర దనుభవాభ్యాం నతి రియమ్.

టీక. కలాభ్యాం = చతుష్షష్టి (64) కళలుగలవారును; (కలిః కామధేనుః అనుటచే కలి ధాతూత్పన్నమైన కలయనుదాని కనేకార్థములుగలవు; వానిని వివరింప విస్తారమగును) చూడాలంకృత = శిరసునం దలంకరించుకొనఁబడిన, శశికలాభ్యాం = చంద్రకళగలవారును; నిజతపః = ఒకరికొఱకొకరు చేసికొనిన తపస్సుయొక్క, ఫలాభ్యాం = ఫలముగలవారును, భక్తేషు = భక్తులమీఁద, ప్రకటిత ఫలాభ్యాం = విశదపఱచిన ఫలముగలవారును; అస్తోక... శివాభ్యాం:—అస్తోక = గొప్పదైన, త్రిభువనశివాభ్యాం = ముల్లోకములకు శుభమునొసఁగువారును; భవాభ్యాం = కారణజన్ములైనట్టియు, ఆనంద.... అనుభవాభ్యాం—ఆనంద = ఆనందముచే, స్ఫురత్ = ప్రకాశితమైన, అనుభవాభ్యాం = అనుభూతిగలవారిను, అగు-శివాభ్యాం = పార్వతీ పరమేశ్వర దంపతులకొఱకు, మే = నాయొక్క; హృదిపునః = హృదయమందైతే; ఇయం = ఈ, నతిః = నమస్కారము; భవతు = అగుగాక !

తా. చతుష్షష్టి కళాస్వరూపులును, చంద్రకళాధరులును, పరస్పర తపఃఫల సంపాదితులును, భక్తతతి కభీష్టదాయకులును, ముల్లోకములకు శుభములొసఁగువారును, కారణజన్ములును, నిత్యానందగోచరులునగు పార్వతీపరమేశ్వరులకు నా మనస్సులో మ్రొక్కులిడుదును.

నమస్తే నమస్తే మహాదేవ! శంభో!
నమస్తే నమస్తే దయాపూర్ణ సింధో!
నమస్తే నమస్తే ప్రపన్నాత్మ బంధో!
నమస్తే నమస్తే నమస్తే మహేశ!

టీక. మహాదేవ! = దేవతల కెల్లదేవుఁడవైనవాఁడా! శంభో! = సుఖమును గల్గించువాఁడా! తే = నీకొఱకు, నమః = నమస్కారము - తే = నీకొఱకు, నమః = నమస్కారము, దయాపూర్ణసింధో = దయతో నిండిన సముద్రుఁడా! నమస్తే నమస్తే = నీకు మరల మరల నమస్కారము. ప్రపన్నాత్మబంధో! = శరణన్నవారి కాత్మబంధువైనవాఁడా! నమస్తే నమస్తే = నీకు నమస్కారము. మహేశ! ఓయీ! లోకమంతటిని శాసించుప్రభువా! నమస్తే, నమస్తే, నమస్తే = నీకు ముమ్మాటికి నమస్కారములు.

తా. ఓయీ! మహాదేవ! శంభో! దయాసాగర! శరణార్తిహార! మహేశ్వర! నీకు పదే పదే నేను నమస్కరించుచున్నాను.

శశ్వచ్ఛ్రీగిరి మూర్ధని త్రిజగతాం రక్షాకృతిం లక్షితాం
సాక్షాదక్షత సత్కటాక్ష సరణి శ్రీమత్సుధావర్షిణీమ్ | త్వ్రీదాం
సోమార్ధాంకిత మస్తకాం ప్రణమతాం నిస్సీమసంప[న్నమః
సుశ్లోకాం భ్రమరాంబికాం స్మితముఖీం శంభోస్సఖీం త్వాం

టీక. త్రిజగతాం = ముల్లోకములకు, రక్షాకృతిం = రక్షణాకారమును, శశ్వత్ = ఎల్లప్పుడు, శ్రీగిరిమూర్ధని = శ్రీశైలపర్వత శిఖరమందు, లక్షితాం = కనఁబడుచునట్టిదియు, సాక్షాత్ = ప్రత్యక్షముగ, అక్షత = తఱుఁగని, సత్కటాక్ష = అనుగ్రహవీక్షణములయొక్క, సరణి = మార్గముచే, శ్రీమత్ = శోభతోఁగూడిన, సుధావర్షిణీమ్ = అమృతమును

వర్షించునదియు, సోమ... మస్తకాం:— సోమార్ధ = చంద్రకళచే, అంకిత = గుర్తుగానున్న, మస్తకాం = శిరస్సును గలిగినదియు. ప్రణమతాం = తనకు నమస్కరించువారలకు, నిస్సీమసంపత్ప్రదాం = మితిలేనిసంపద నిచ్చునదియు, సుశ్లోకాం = మంచివారిచే గొనియాడఁబడునదియు, స్మితముఖీం = చిఱునవ్వుగల ముఖముఁ గలిగినదియు, శంభోః = శంకరునకు, సఖీం = ప్రియురాలైన, భ్రమరాంబికాం = భ్రమరాంబ యను పేరుగల, త్వామ్ = నిన్నును, నుమః = నమస్కరించుచున్నాము.

తా. లోకరక్షణమునకై శ్రీశైలశిఖరమున నెల్లప్పుడు నాకారమును గల్గియున్నట్టియు, అక్షయము నమృత సమ్మితమైన చూపులను భక్తులపై నెఱపునదియు, చంద్రరేఖావతంసయు, మితిలేని సంపదల నాశ్రితులకిచ్చుచు సుజనులచే నుతింపఁబడునదియు శివునర్ధాంగియు భ్రమరాంబ యను నామముగల నిన్ను ను స్తోత్రించుచున్నాము.

మాతః! ప్రసీద; సదయాభవ భవ్యశీలే!
లీలాలవాకలిత దైత్యకులాపహారే!
శ్రీచక్రరాజనిలయే! శ్రుతిగీతకీర్తే!
శ్రీశైలనాథదయితే! తవ సుప్రభాతమ్.

టీక. మాతః! = ఓతల్లీ!, ప్రసీద = అనుగ్రహింపుము; భవ్యశీలే! = మంగళస్వభావము గలదాన! సదయా = దయతోఁగూడినదానవు, భవ = అగుము; లీలా....హారే!:—లీలాలవ = విలాసలేశముచేతనే, ఆకలిత = చూడఁబడిన, దైత్యకుల = రాక్షస వంశమును. అపహారే! = నాశన మొందించినదాన! శ్రీచక్రరాజనిలయే! = ఉత్తమమగు శ్రీచక్రము నాధారముగఁజేసికొనినదాన!, శ్రుతిగీతకీర్తే! = వేదములచేఁ గీర్తింపఁబడిన కీర్తిగలదాన! శ్రీశైలనాథదయితే! = శ్రీశైలపతికి ప్రియురాల

నగు నో భ్రమరాంబ! తవ = నీకు, సుప్రభాతమ్ = సుఖమయమైన యుదయమగుఁగాక!

తా. ఓ తల్లి! నీవు మంగళమగు మనస్సుగలదానవు; కృపావతివి, కావున మమ్మనుగ్రహింపుము; శ్రీ చక్రము నధిష్ఠించి యొక్కసారి విలాసమున దుష్టరాక్షసులఁజూచి వారినంత మొందించినదాన! వేదవాక్యములచే సుప్రతిష్ఠిత మగు కీర్తిగలదాన! శ్రీశైలనాథార్ధదేహ భాగినియగు నో భ్రమరాంబాదేవి! నీకిది సుప్రభాతమగుఁగాక!

శంభో! సురేంద్రనుత! శంకర! శూలపాణే
చంద్రావతంస! శివ! శర్వ! పినాకపాణే!
గంగాధర! క్రతుపతే! గరుడధ్వజాప్త!
శ్రీ మల్లికార్జునవిభో! తవ సుప్రభాతమ్.

టీక. శంభో = సుఖమును గల్గించువాఁడా! సురేంద్రనుత = ఇంద్రునిచే స్తుతింపఁబడువాఁడా! శంకర! = మంగళముల నొసంగుచువాఁడా! శూలపాణే = శూలాయుధమును హస్తమందు గలవాఁడా! చంద్రావతంస = చంద్రుని శిరసున ధరించినవాఁడా! శివ! = మంగళ మగు రూపముగలవాఁడా! శర్వ = సర్వస్వరూపుఁడా! పినాకపాణే = పినాకమను పేరుగల ధనస్సును చేతియందుఁ గలవాఁడా! గంగాధర! = గంగను ధరించినవాఁడా! క్రతుపతే = యజ్ఞమున కధిపతియైనవాఁడా!, గరుడధ్వజ = విష్ణువునకు, ఆప్త = ప్రియమైనవాఁడా! శ్రీ మల్లికార్జున విభో! = శోభితోఁగూడిన ఓ మల్లికార్జునేశ్వర! తవ = నీకు, సుప్రభాతమ్ = సుఖమగు ప్రభాతమగుఁగాక!

తా. 'శంభో' అనునదాదిగాఁగల పై శ్లోకములోఁ జెప్పబడిన

పదునొకండు నామములతోఁ గూడిన యో రుద్రుఁడా! (మల్లికార్జున!) నీ కీ యుదయము శుభమైనదగుఁగాక!

విశ్వేశ! విశ్వజనసేవిత! విశ్వమూర్తే!
విశ్వంభర! త్రిపురభేదన! విశ్వయోనే!
ఫాలాక్ష! భవ్యగుణ! భోగివిభూషణేశ!
శ్రీ మల్లికార్జునవిభో! తవ సుప్రభాతమ్.

టీక. విశ్వేశ! = ప్రపంచమును శాసించువాఁడా! విశ్వజనసేవిత! = ప్రపంచమందలి జీవకోటిచే సేవింపఁబడినవాఁడా!; విశ్వమూర్తే! = ప్రపంచమే స్వరూపముగాఁ గలవాఁడా!; విశ్వంభర! ప్రపంచభారమును మోయువాఁడా! త్రిపురభేదన! = త్రిపురాసురులను భేదించినవాఁడా!, విశ్వయోనే! = ప్రపంచమునకుఁ గారణమైనవాఁడా!, ఫాలాక్ష! = నొసట మూఁడవకన్ను గలవాఁడా!, భవ్యగుణ! = శుభమగు గుణములు గలవాఁడా!, భోగివిభూషణేశ! = సర్పముల నాభరణముగాఁ గల ప్రభువా!, శ్రీ మల్లికార్జునవిభో! = శోభాయుక్తుఁడవగు నో మల్లికార్జునప్రభూ!, తవ = నీకు, సుప్రభాతమ్ = శోభనమగు నుదయకాలమగుఁగాక!.

తా. 'విశ్వేశ' అనునది మొదలు తొమ్మిదినామముల ధరించిన ఓమల్లికార్జునస్వామీ! నీకీప్రభాతముశోభనమైనదగుఁగాక!

కల్యాణరూప! కరుణాకర! కాలకంఠ!
కల్పద్రుమ ప్రసవపూజిత! కామదాయిన్!
దుర్నీతిదైత్య దళనోద్యత! దేవదేవ!
శ్రీ మల్లికార్జునవిభో! తవ సుప్రభాతమ్.

టీక. కల్యాణరూప! = మంగళమైన రూపముగలవాఁడా!; కరుణాకర! = దయానిధియైనవాఁడా!; కల్పద్రుమ.......పూజిత! :— కల్పద్రుమ =

కల్పవృక్షమాల సంబంధమగు, ప్రసవ = పుష్పములచే, పూజిత! = పూజింపఁబడువాఁడా!; కామదాయిన్! = కోరికలిచ్చువాఁడా!; దుర్నీతి....ఉద్యత :- దుర్నీతి = దుర్నయులైన, దైత్య = రాక్షసులను, దళన = ఛేదించుటయందు; ఉద్యత! = సంసిద్ధుఁడా!; దేవదేవ! = దేవతలకెల్ల దేవుఁడైనవాఁడా!, శ్రీ మల్లికార్జునవిభో! = శోభాయుతుఁడవగు నో మల్లికార్జునస్వామీ! తవ = నీకు, సుప్రభాతమ్ = శుభోదయమగుఁగాక!

తా. 'కల్యాణరూప' అనునది మొదలు సప్తనామములతో శోభిల్లునో మల్లికార్జునస్వామీ! నీకు శుభోదయమగుఁగాక!

గౌరీ మనోహర! గణేశ్వర సేవితాంఘ్రే!
గంధర్వ యక్ష సుర కిన్నర గీత కీర్తే!
గండావలంబి ఫణికుండల మండితాస్య!
శ్రీ మల్లికార్జునవిభో! తవ సుప్రభాతమ్.

టీక. గౌరీ మనోహర! = పార్వతీ ప్రియుఁడా!; గణేశ్వర = ప్రమథగణ నాథునిచే, సేవిత = సేవింపఁబడుచున్న, అంఘ్రే! = పాదములు గలవాఁడ! గంధర్వ... కీర్తే! :— గంధర్వ = గంధర్వులచేత, యక్ష = యక్షులచేత, కిన్నర = కిన్నరులచేత (ఈమూఁడు రకములగు కులములు గల దేవతలు సంతోషమున గానముచేయుటలో ప్రవీణులు) గీత = కీర్తింపఁబడిన; కీర్తే! = యశస్సుగలవాఁడా!; గండావలంబి = గండస్థలముల వఱకు వ్రేలాడుచున్న; ఫణికుండల = పాముల నెడి చెవిపోగులతో, మండిత = అలంకరింపఁబడిన, ఆస్య = ముఖము గలవాఁడా!; శ్రీ మల్లికార్జునవిభో! = శోభతోఁగూడిన, ఓ మల్లికార్జునస్వామీ! తవ = నీకు, సుప్రభాతమ్ = శుభోదయమగుఁగాక!

తా. 'గౌరీ మనోహర' అను నామచతుష్టయముగల ఓ మల్లికార్జునస్వామీ! నీకు శుభోదయమగుఁగాక!

నాగేంద్రభూషణ ! నిరీహిత ! నిర్వికార !
నిర్మాయ ! నిశ్చల ! నిరర్గల ! నాగభేదిన్
నారాయణీప్రియ ! నతేష్టద ! నిర్మలాత్మన్ !
శ్రీ పర్వతాధిప ! విభో ! తవ సుప్రభాతమ్.

టీక. నాగేంద్రభూషణ! = వాసుకి, శేషుఁడు మొదలగు రాజసర్పములు భూషణముగఁ గలవాఁడా!, నిరీహిత! = కోరికలు లేనివాడా! నిర్వికార! = జన్మాది షడ్వికారములు లేనివాఁడా!, నిర్మాయ = మాయా విరహితుఁడా! నిశ్చల! = స్థాణుస్వరూపుఁడా! నిరర్గల! = అవరోధము లేనివాఁడా! నాగభేదిన్! = గజేంద్ర సంహారకుఁడా!, నారాయణీ ప్రియ! = నారాయణి యను పేరుగల శాంకరికి ప్రియుఁడైనవాఁడా!, నతేష్టద! :— నత = నమస్కరించువారలకు, ఇష్టద = ఇష్టములనిచ్చువాఁడా! నిర్మలాత్మన్ :— నిర్మల = స్వచ్ఛమైన, ఆత్మన్ = దేహము గలవాఁడా! (శివుఁడు తెల్లనిదేహము గలవాఁడనుట) లేదా? పరిశుద్ధాంతఃకరణము గలవాఁడా! శ్రీ పర్వతాధిప! = శ్రీ యను పేరుగల కొండపై నివసించు ప్రభూ!, విభో! = ఓ దేవ!, తవ = నీకు, సుప్రభాతమ్ = శుభోదయమగును గాక !

తా. 'నాగేంద్రభూషణ' అను నామము మొదలుకొని పదునొకండు నామములతోఁగూడిన యో శంకరా! నీకు శుభోదయ మగునుగాక!

సృష్టం త్వ యైవ జగదేత దశేష మీశ !
రక్షా విధిశ్చ విధిగోచర ! తావకీనః
సంహారశక్తి రపి శంకర ! కింకరీతే
శ్రీశైల శేఖరవిభో ! తవ సుప్రభాతమ్.

టీక. ఈశ = ఓ ప్రభువా! ఏతత్ = ఈ, అశేషం = సమస్తమగు, జగత్ = లోకము. త్వయైవ = నీచేతనే, సృష్టం = సృజింపఁబడినది.

విధిగోచర! = ఓయీ! అదృష్టరూపుఁడా!, రక్షావిధిశ్చ = లోకరక్షణ విధానమును, తావకీనః = నీ సంబంధమైనదే! శంకర! = ఓ శంకరుఁడా! సంహారశక్తిరపి = లయమొనర్చుశక్తియు, తే = నీకు, కింకరి = వశమైన సేవకురాలేగద? శ్రీశైలశేఖరవిభో! = శ్రీశైలపర్వతమందుండెడి యో దేవుఁడా! తవ = నీకు, సుప్రభాతమ్ = శుభోదయమగుఁగాక!

తా. ఓ శ్రీశైలవాస! నీవు, ఈశ్వరుఁడవై లోకముల సృజించుచు విష్ణుస్వరూపుఁడవై లోకరక్షణభారమును నిర్వహించుచు శివుఁడను నామమున లయకర్తవై సర్వమును వహించిన యో శ్రీశైలవాస! శంకరా! నీకు శుభోదయమగుగాక!

ఏకస్త్వమేవ బహుధా భవ! భాసిలోకే
నిశ్శంక ధీ! ర్వృషభకేతన! మల్లినాథ!,
శ్రీ భ్రామరీప్రియ! సుఖాశ్రయ! లోకనాథ!
శ్రీశైలశేఖరవిభో! తవ సుప్రభాతమ్.

టీక. భవ! = ఓయీ! శంకరుఁడా!, త్వం = నీవు, ఏకఏవ = ఒక్కఁడవే, లోకే = లోకమందు, బహుధా = అనేకరూపములతో, భాసి = ప్రకాశించుచున్నావు. నిశ్శంకధీః = నిర్భయబుద్ధిగలవాఁడ! వృషభకేతన = వృషభధ్వజముగలవాఁడా! మల్లినాథ! = మల్లీశ్వరుఁడా, శ్రీ భ్రామరీప్రియ = శ్రీ భ్రమరాంబాదేవికి ప్రియుఁడైనవాఁడా!, సుఖాశ్రయ! = సుఖమునకాశ్రయమైనవాఁడా!, లోకనాథ! = లోకములకుఁ బ్రభువైనవాఁడా!, శ్రీశైలశేఖరవిభో! = శ్రీశైలరాజమున నుండెడి ప్రభువా!, తవ = నీకు, సుప్రభాతమ్ = శుభోదయమగుగాక!

తా. ఓయీ! భవుఁడా! నీ వొక్కఁడవే అనేకరూపములతో నీలోకమునఁ బ్రకాశించుచున్నావు. 'నిశ్శంక ధీ' అను

నామము మొదలు ఆఱునామములతో నొప్పు శ్రీశైల వాస! నీకు శుభోదయమగుఁగాక!

పాతాళగాంగ జల మజ్జన నిర్మలాంగాః
భస్మత్రిపుండ్ర సమలంకృత ఫాలభాగాః
గాయంతి దేవముని భక్తజనా భవంతం
శ్రీ మల్లికార్జునవిభో! తవ సుప్రభాతమ్.

టీక. పాతాళ ...అంగాః :—పాతాళగాంగజల = పాతాళగంగలోని నీటియందు, మజ్జన = స్నానముచేత, నిర్మల = పాపరహితమైన, అంగాః = అవయవములు గలిగినట్టియు, భస్మత్రిపుండ్ర = విభూతితో మూడడ్డరేఖలుగా, సమలంకృత = అలంకరించుకొనఁబడిన, ఫాలభాగాః = నొసటిభాగముగలవారగు, దేవమునిభక్తజనాః = దేవతలు, మునులు, భక్తజనులును, భవంతం = నిన్ను, గాయంతి = కీర్తించుచున్నారు. శ్రీ మల్లికార్జునవిభో! = కాంత్యుపేతుఁడవైన ఓ మల్లికార్జునస్వామీ! తవ = నీకు, సుప్రభాతమ్ = శోభనోదయమగుఁగాక!

తా. ఓ మల్లికార్జునస్వామి! దేవతలు, మునులు, భక్తులు నందఱును పాతాళగంగను స్నానించి నిర్మలాంతఃకరణులై భస్మ త్రిపుండ్ర రేఖల నలంకృతమైన మోములతో వచ్చి నీ సన్నిధినుండి నిన్నుఁ గీర్తించుచున్నారు; నీ కీ ప్రభాతసమయము శుభమైనది; లెమ్ము.

సారస్వతాంబు యుత భోగవతీ శ్రితాయాః
బ్రహ్మేశ విష్ణుగిరిచుంబిత కృష్ణవేణ్యాః,
సోపానమార్గ మధి రుహ్య భజంతి భక్తా
శ్రీ మల్లికార్జునవిభో! తవ సుప్రభాతమ్.

టీక. సారస్వత = రసముతోఁ జెలువొందు, అంబు = ఉదకముతో, యుత = కూడిన, భోగవతీ = పాతాళగంగయను నామమును, శ్రితాయాః = ధరించినట్టియు; బ్రహ్మ = బ్రహ్మశిఖరము, ఈశ = ఈశ్వరశిఖరము, విష్ణుగిరి = విష్ణుశిఖరము ను కూటత్రయము చే, చుంబిత = తాకఁబడుచున్న, కృష్ణవేణ్యాః = కృష్ణానదియొక్క, సోపానమార్గం = మెట్లమార్గమును; అధిరుహ్య = ఎక్కి, భక్తాః = నీ భక్తులు, భజంతి = నిన్ను సేవించుచున్నారు. శ్రీ మల్లికార్జునప్రభో! = ఓ మల్లికార్జునదేవ! తవ = నీకు, సుప్రభాతమ్ = శుభోదయమగుఁగాక!

తా. ఓ మల్లికార్జునస్వామి! నీ భక్తులందఱును—బ్రహ్మవిష్ణు శివ నామములతోనున్న శిఖరములనంటి ప్రవహించు నదియు, కృష్ణానదీస్థాన విశేషమైనదియు, మధురోదకము లతో నిండిన పాతాళగంగలో, (భోగవతి) స్నానముచేసి యచటినుండి నీయొద్దకువచ్చు సోపానమార్గములోనుండి నిన్ను సేవించుచున్నారు; నీ కీ ప్రభాతము సుప్రసన్న మగుఁగాక!

శ్రీ మల్లికార్జున మహేశ్వర సుప్రభాత<br>
స్తోత్రం పఠంతి భువి యే మనుజాః ప్రభాతే,<br>
తే సర్వసౌఖ్య మనుభూయ పరానవాప్యం<br>
శ్రీ శాంభం పదమవాప్య ముదం లభంతే

టీక. శ్రీమల్లికార్జున = శ్రీయుతుఁడగు మల్లికార్జునుఁడైన, మహేశ్వర = శివుని యొక్క, సుప్రభాత = ప్రాతఃకాలశోభను జెప్పునట్టి, స్తోత్రం = ఈ స్తవమును, ప్రభాతే = ప్రాతస్సమయమున, యే = ఏ, మనుజాః = మానవులు, భువి = భూలోకమందు, పఠంతి = పఠించుచున్నారో, తే = వారు, సర్వసౌఖ్యం = అన్నివిధములగుసౌఖ్యమును అనుభూయ =

అనుభవించి, పరానవాప్యం = ఈ సుప్రభాతపఠనము లేనివారు పొందలేని, శ్రీ శాంభవం పదం = శ్రీ శంకర నివాసస్థానమగు కైలాసమును, అవాప్య = పొంది, ముదం = సంతోషమును, లభంతే = పొందుచున్నారు.

తా. ఈ మల్లికార్జున సుప్రభాతమును ప్రతి ప్రాతస్సమయమున నే మానవులు శ్రద్ధతోఁ పఠింతురో వారీలోకమున సర్వసౌఖ్యము లనుభవించి చివరకు కైలాసమున కేగి సంతసింతురు.



# అథ శ్రీ మల్లికార్జున స్తోత్రమ్
## (టీకాతాత్పర్యసహితమ్)

నమశ్శివాభ్యాం నవ యౌవనాభ్యాం
పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యాం,
నగేంద్రకన్యా వృషకేతనాభ్యాం
నమోనమ శ్శంకర పార్వతీభ్యాం.

టీక. నవయౌవనాభ్యాం = నిత్యనూతనమగు యౌవనమును గల్గినట్టియు, పరస్పర = అన్యోన్యము, ఆశ్లిష్ట = ఆలింగనము చేసికొనఁబడిన, వపుః = శరీరమును, ధరాభ్యాం = ధరించినట్టియు, నగేంద్రకన్యా = హిమవత్పుత్రికయు. వృషకేతనాభ్యాం = వృషభధ్వజమును గల్గినట్టియు, శివాభ్యాం = మంగళకరులైన, శంకరపార్వతీభ్యాం = పార్వతీపరమేశ్వరుల కొఱకు, నమోనమః = మామ్మాటికి నమస్కారము (ఇందు మొదట నొక - నమః, నాల్గవపాదాది నమోనమః - అని రెండునుగలిసి మువ్మారు నమస్కారమని యర్థము.)

తా. నిత్యనూత్న యౌవనశోభితులును, పరస్పరాలింగిత శరీరులు నర్ధనారీశ్వరరూపులును, హైమవతీ వృషభపతాకములను గలిగి శోభన దేహమున నొప్పారు పార్వతీపరమేశ్వరులకు మా నమస్కారము.

నమశ్శివాభ్యాం వృషవాహనాభ్యాం
విరించి విష్ణ్వింద్ర సుపూజితాభ్యాం,
భూతిపాటీర విలేపనాభ్యాం
నమోనమ శ్శంకర పార్వతీభ్యాం.

టీక. శివాభ్యాం = మంగళకరులైనట్టియు, వృషవాహనాభ్యాం = వృషభము వాహనముగఁ గలిగినట్టియు; విరించి = బ్రహ్మచేత, విష్ణు =

విష్ణువుచేత, ఇంద్ర = దేవేంద్రునిచేత, సుపూజితాభ్యాం = బాగుగఁ బూజింపఁబడినట్టియు, విభూతిపాటీరవిలేపనాభ్యాం = భస్మ మొకవైపునను, మంచిగంధ మొకప్రక్కను మై పూఁతగాఁగలిగినట్టి, శంకరపార్వతీభ్యాం = పార్వతీపరమేశ్వరులకు, నమః, నమోనమః = మామ్మాటికి నమస్కారము.

తా. శుభాకారులైనట్టియు, వృషభ వాహనారూఢులును, బ్రహ్మవిష్ణ్వింద్రాదులచేఁ బూజింపఁబడునట్టియు, విభూతియు, మంచిగంధము నిరుప్రక్కలఁ బ్రత్యేకముగఁ బూసికొన్న దేహముగల ఆ పార్వతీపరమేశ్వరులు నా నమస్కారములను గ్రహింతురుగాక!

అనఘం జనకం జగతాం ప్రథమం
వరదం కరశూల ధరం సులభమ్,
కరుణాంబునిధిం కలుషాపహరం
ప్రణమామి మహేశ్వరమేకమహమ్.

టీక. అనఘం = పాపరహితుఁడును, జగతాం = లోకములకు, జనకం = తండ్రియైనట్టివాఁడును, ప్రథమం = దేవతలలో నాద్యుఁడైనట్టివాఁడును, వరదం = వరము లిచ్చు వాఁడును, కరశూలధరం = చేతియందు శూలాయుధమును ధరించినవాఁడును, సులభం = సౌలభ్యముగలవాఁడును (అనఁగా భగవంతుఁడు భక్తసులభుఁడనుట) కరుణాంబునిధిం = దయాసముద్రుఁడును, కలుషాపహరం = ఆశ్రితులపాపములనుబోగొట్టువాఁడును, ఏకం = అద్వితీయమైన, మహేశ్వరం = శ్రీశైలనాథుని, అహం = నేను, ప్రణమామి = నమస్కరించుచున్నాను.

తా. పుణ్యరాశియు, సర్వలోకజనకుఁడును, ఆద్యుఁడును, వరప్రదాతయు, శూలపాణియు, సులభుఁడును, దయాసము

ద్రుఁడును, జీవులాశ్రయించినచోఁ బాపముల హరించు వాఁడును, నద్వైతమూర్తియునగు నా శివుని నే నెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

అమలం కమలోద్భవగీతగుణం
శమదం సమదాసుర నాశకరం,
రమణీయరుచిం కమనీయ తనుం
నమ, సాంబశివం నతపాపహరం.

టీక. అమలం = స్వచ్ఛుఁడైనట్టియు, కమలోద్భవ = బ్రహ్మచే, గీత = కీర్తింపఁబడిన, గుణం = గుణములు గలవాఁడును, శమదం = ఇంద్రియ నిగ్రహప్రదుఁడును, సమదాసుర = మదముతోఁగూడిన రాక్షసులకు, నాశకరం = వినాశకరుఁడైనట్టి వాఁడును, రమణీయ = సుందరమైన, రుచిం = కాంతిగలవాఁడును, కమనీయ = కోరఁదగిన, తనుం = దేహముగల వాఁడును, నత = నమస్కరించెడివారి, పాపహరం = పాపముల హరించునట్టి, సాంబశివం = అర్ధనారీశ్వరుఁడగు శివుని, నమ = నమస్కరింపుమా!

తా. ఓ మనసా! నీవు—నిర్మలుఁడును, బ్రహ్మాదిదేవతాస్తూయమానుఁడును, మనోనిగ్రహప్రదుఁడును, మదించిన రాక్షసుల మదమడంచినవాఁడును, సుందరమగు కాంతియు, స్వచ్ఛమై రమణీయ దేహముగల సాంబశివుని నమస్కరింపుము - నీ నమస్కారముచే నీ పాతకము లాతఁ డడంచును.

శివం శంకరం బంధురం సుందరేశం
నటేశం గణేశం గిరీశం మహేశం,

దినేశేందునేత్రం సుగాత్రం మృడానీ
పతిం శ్రీగిరీశం హృదాభావయామి.

టీక. శివం = మంగళకరుఁడును, శంకరం = సుఖప్రదుఁడును, బంధురం = ప్రేమయుక్తుఁడును, సుందరేశం = సౌందర్యరాశియును, నటేశం = నటరాజైనట్టియు, గణేశం = ప్రమథగణప్రభువైనట్టియు గిరీశం = కైలాసాధిపతియు, మహేశమ్ = సర్వేశ్వరుఁడైనట్టియు, దినేశేందునేత్రం = సూర్యచంద్రులు కన్నులుగాఁగలవాఁడును, సుగాత్రం = మంచిదేహము గలవాఁడును, మృడానీపతిం = పార్వతీపతియునగు, శ్రీగిరీశం = శ్రీశైలాధిపతియగు మల్లికార్జునుని, హృదా = నామనస్సుచేత, భావయామి = తలఁచుచున్నాను.

తా. లోకమంగళప్రదుఁడును, సర్వసుఖంకరుఁడును, సుందరేశ, నటేశ, గణేశ, గిరీశ, మహేశాది నామముల ధరించినవాఁడును, సూర్యచంద్రులఁ గన్నులుగాఁగలవాఁడును, మంచి దేహముతోఁగూడి పార్వతీప్రియుఁడై యున్న మల్లికార్జునస్వామిని నా మనసులోఁ దలఁచుకొందును.

భృంగీచ్ఛానటనోత్కటః, కరిమదగ్రాహీ, స్ఫురన్మాధవా
హ్లాదో, నాదయుతో, మహాసితవపుః, పంచేషుణాచాదృతః,
సత్పక్షః, సుమనోవనేషు, సపునస్సాక్షాన్మదీయే మనో
రాజీవే, భ్రమరాధిపో విహరతాం శ్రీశైలవాసీ విభుః.

టీక. భృంగీచ్ఛానటనోత్కటః = భృంగియను ప్రమథగణనాయకుని లయానుసారము నాట్యముఁజేయుట వేడ్కగలవాఁడును, కరిమదగ్రాహీ = గజేంద్రుని మదమడంచినవాఁడును, స్ఫురన్మాధవాహ్లాదః = ప్రకాశవంతుఁడగు విష్ణువున కాహ్లాదమిచ్చువాఁడును, నాదయుతః = ప్రణవ

నాదముతోఁ గూడినవాఁడును, మహాసితవపుః = మిక్కిలి తెల్లనగు శరీరము గలవాఁడును, పంచేషుణా చ = మన్మథునిచేత, ఆదృతః = ఆదరింపఁబడినవాఁడును, సుమనోవనేషు = మంచిమనస్సులనెడి వనములందు, సత్పక్షః = సదాశ్రయముగల పతంగమువంటివాఁడును, భ్రమరాధిపః = భ్రమరాంబానాథుఁడును, శ్రీశైలవాసీ = శ్రీగిరియందావాసముగల, సః = ఆ, విభుః పునః = ప్రభువగు మల్లికార్జునదేవుఁడయితే, సాక్షాత్ = ప్రత్యక్షముగ, మదీయే = నా సంబంధమైన, మనోరాజీవే = మనస్సనెడి కలువపూవునందు, విహరతాం = విహారముఁ జేయును గాక!

తా. భృంగి లయానుసారము నాట్యముఁ జేయువాఁడును, గజాసుర సంహారకుఁడును, విష్ణుమనోహ్లాదకుఁడును, ప్రణవనాదప్రియుఁడును, ధవళాంగుఁడును, మన్మథునిచే నుతింపఁబడిన వాఁడును, సత్పురుష పక్షపాతముగల శ్రీశైలవాసియైన భ్రమరాంబికాపతి నా మనో రాజీవమున నుండుగాక!

సోమోత్తంస స్సుర పరిషదామేష జీవాతురీశః
పాశచ్ఛేత్తా పదయుగ జుషాం ఫుల్లమల్లీనికాశః,
ధ్యేయో దేవః ప్రకటిత వధూరూపవామాత్మభాగ
శ్శ్రీశైలాగ్రే కలితవసతి ర్విశ్వరక్షాధురీణః

టీక. సోమోత్తంసః = చంద్రుఁడు శిరోభూషణముగాఁ గలవాఁడును, సురపరిషదాం = దేవసంఘములకు, జీవాతుః = బ్రదుకుఁదెరువుఁ జూపినవాఁడును, ఏషః = ఈ ముందుభాగముననున్న, ఈశః = ఈశ్వరుఁడును (నియమనశీలుఁడు) పదయుగ = తన పాదద్వంద్వమును. జుషాం = ఆశ్రయించినవారలయొక్క, పాశచ్ఛేత్తా = సంసారపాశమును ద్రెంచువాఁడును, ఫుల్ల = వికసించిన, మల్లీ = మల్లెపూలతో, నికాశః = సమానమైనవాఁడు, (తెల్లని దేహము గలవాఁడనుట) ప్రకటిత = స్పష్టపఱచు

చున్న, వధూరూప = ఆఁడురూపము. వామ = ఎడమదగు, ఆత్మ భాగః = తనదేహభాగముఁ గలవాఁడును, శ్రీశైలాగ్రే = శ్రీశైలశిఖరమున, కలితవసతిః = కల్పించుకొనిన నివాసముగలవాఁడును, విశ్వరక్షాధురీణః = ప్రపంచరక్షణ భారమునుగలిగిన, దేవః = మల్లికార్జునదేవుఁడు, ధ్యేయః = ధ్యానగోచరుఁడగుగాక !

తా. చంద్రశేఖరుఁడును, దేవసంఘముల కాధారుఁడును, తన చరణముల నాశ్రయించినవారి భవబంధచ్ఛేదకుఁడును, మల్లెపూలవలె తెల్లనికాంతిగల శరీరమును ధరించినవాఁడును, అర్ధనారీశ్వరుఁడైన యీ మల్లికార్జునదేవుఁడు నా ధ్యానమున గోచరించుఁగాక !

ఏణంపాణౌ, శిరసి తరుణోల్లాస మేణాంక ఖండం
పార్శ్వేవామే వపుషి తరుణీం, దృక్షు కారుణ్యలీలాం,
భూతింఫాలే, స్మితమపిముఖే, గాంగమంభః కపర్దే,
బిభ్రత్ప్రేమ్ణా, భువనమఖిలం శ్రీగిరీశస్సపాయాత్.

టీక. పాణౌ = చేతియందు, ఏణం = లేడిని; శిరసి = తలపైన, తరుణోల్లాసం = యౌవనముచేఁ బ్రకాశించు (అనఁగా సప్తమ్యష్టమినాఁటి) ఏణాంకఖండం = చంద్రకళను; వామే = ఎడమదైన, పార్శ్వే = భాగమందు (ప్రక్కయందు) వపుషి = శరీరమున, తరుణీం = ఆఁడురూపమును; దృక్షు = చూపులందు, కారుణ్యలీలాం = దయావిలాసమును; ఫాలే = నొసటియందు, భూతిం = విభూతిని, ముఖే = వదనమందు, స్మితమపి = చిఱునవ్వును, కపర్దే = జటాజూటమున, గాంగం = గంగ సంబంధమైన, అంభః = ఉదకమును; బిభ్రత్ = ధరించునట్టి, సః = ఆ, శ్రీగిరీశః = శ్రీగిరిప్రభువగు మల్లికార్జునుఁడు, అఖిలం = చరాచరరూపమగు, భువనం = విశ్వమును, ప్రేమ్ణా = ప్రీతితో, పాయాత్ = రక్షించుఁగాక!

తా. హస్తమున లేడిని, తలపై బాలచంద్రుని, వామదేహమున నారిని, చూపులలో దయను, ఫాలమున విభూతిని ముఖమునఁ జిఱునవ్వును, జటాజూటమున గంగోదకము ను ధరించిన శ్రీశైలవాసుఁడు ప్రీతితో నీ విశ్వమంతటిని రక్షించుఁగాక!

శ్రీశైలే స్వర్ణశృంగే మణిగణరచితే కల్పవృక్షాళిశీతే
స్ఫీతే సౌవర్ణ రత్నస్ఫురిత నవగృహే దివ్యపీఠే శుభార్ద్రే
ఆసీనస్సోమచూడః స కరుణనయనః సాంగనస్స్మేరవక్త్రః
శంభుశ్శ్రీ భ్రామరీశః ప్రకటిత విభవో దేవతా సార్వభౌమః

టీక. స్వర్ణశృంగే = బంగారు గోపురములుగల, శ్రీశైలే = శ్రీగిరియందు, మణిగణరచితే = మణిసముదాయముచే నిర్మింపఁబడినదియు, కల్పవృక్షాళిశీతే = కల్పవృక్షసమూహముతోఁ జల్లనైనట్టియు, స్ఫీతే = విశాలమైనట్టియు, సౌవర్ణరత్నస్ఫురిత = బంగారముతోను, రత్నములతోఁ బ్రకాశించు, నవగృహే = నూతనాలయమందు, శుభార్ద్రే = మంగళోచితమైన, దివ్యపీఠే = శోభించు పీఠముపై, ఆసీనః = కూర్చున్నవాఁడును, సోమచూడః = చంద్రుని శిరముననుంచుకొనినవాఁడును, సకరుణనయనః = దయతోఁగూడిన నేత్రములుగలవాఁడును, సాంగనః = ఆఁడుదానితోఁగూడినవాఁడును, (అర్ధనారీశ్వరుఁడనుట) స్మేరవక్త్రః = నవ్వుచున్న ముఖముతోనున్న వాఁడును, శ్రీ భ్రామరీశః = మంగళవతియగు భ్రమరాంబకుఁ బతియును, దేవతాసార్వభౌమః = దేవతలలో సమ్రాట్టయిన, శంభుః = శివుఁడు, ప్రకటిత విభవః = తన వైభవమును బ్రకాశింపఁ జేయుచుండెను.

తా. కనకగోపురములుగల శ్రీగిరియందు, కల్పవృక్షచ్ఛాయ విశాలమై, రత్నములుపొదివిన బంగరు కాంతులతో నొప్పు

నాలయమున, మంగళాసనముపైఁ గూరుచుండి, పార్వతిని వామాంకమున నిడుకొని, దయా కటాక్షములఁ బఱపు దేవతా సార్వభౌముఁడైన ఆ భ్రమరాంబాపతి తనవైభవము నాశ్రితులకుఁ బ్రకటించుచుండెను.

యా యోగిబృంద హృదయాంబుజ రాజహంసీ
మందస్మితస్తుతముఖీ మధుకైటభఘ్నీ,
విఘ్నాంధకార పటభేదపటీయసీ సా
మూర్తిః కరోతు కుతుకం భ్రమరాంబికాయాః

టీక. యా = ఏ భ్రమరాంబామూర్తి, యోగిబృంద = యోగీశ్వరసముదాయము యొక్క. హృదయాంబుజ = హృదయమను పద్మమందు, రాజహంసీ = రాజరాజ హంసాంగనయయ్యెనో, మందస్మిత = చిఱునవ్వుచే, స్తుతముఖీ = కొనియాడఁదగిన మోముగలదయ్యెనో, మధుకైటభఘ్నీ = మధుకైటభాది రాక్షస విధ్వంసకారిణియో, విఘ్నాంధకార = విఘ్నములనెడు చీఁకటియొక్క, పట = సముదాయమును, భేదపటీయసీ = చీల్చివేయ సమర్థురాలో, సా = ఆ, భ్రమరాంబికాయాః = భ్రమరాంబాదేవియొక్క, మూర్తిః = స్వరూపము, కుతుకం = ఉల్లాసమును, కరోతు = చేయుఁగాక!

తా. ఏ మూర్తిని యోగిబృందము హృదయాంబుజమున నిల్పెనో, ఎల్లప్పుడేమూర్తి చిఱునవ్వుమోముతో విలసిల్లుచుండునో, ఏమూర్తి మధుకైటభాదిరాక్షస నిహంత్రియో, ఏమూర్తి విఘ్నాంధకార నిర్మూలన మొనర్చునో ఆభ్రమరాంబాదేవియొక్క మూర్తి మాకుల్లాసమును గల్గించుఁగాక!

కస్తూరీ తిలకాంచితేందు విలసత్ప్రోద్భాసి ఫాలస్థలీం
కర్పూరద్రవ మిశ్రచూర్ణ ఖపురామోదోల్లస ద్వీటికాం,
లోలాపాంగ తరంగితైరతి కృపాసారైర్నతా నందినీం
శ్రీశైలస్థలవాసినీం భగవతీం శ్రీమాతరం భావయే.

టీక. కస్తూరీతిలక = కస్తురిబొట్టుతో, అంచిత = కూడి, ఇందు విలసత్ = చంద్రునితోఁ బ్రకాశించుచు, ప్రోద్భాసి = మిక్కిలి కాంతివంతమైన, ఫాలస్థలీం = ఫాలభాగముగలదియు, కర్పూరద్రవ = పచ్చకప్పురపు ద్రవముతో, మిశ్ర = కలిసిన, చూర్ణఖపురా = తుంగముస్తెలపొడితో, ఆమోద = పరిమళముతో, ఉల్లసత్ = ఉల్లాసమానుగొల్పెడి, వీటికాం = తాంబూలచర్వణముగలదియు, లోలాపాంగతరంగితైః = చంచలములగు క్రీగంటిప్రసారముల నెడి తరంగములతోఁగూడిన, (అతి) కృపాసారైః = అమితమగు దయావర్షములచేత, నతానందినీం = నమస్కరించు భక్తుల కానందమిచ్చునదియు, శ్రీశైలస్థలవాసినీం = శ్రీశైల ప్రదేశమున వసించునట్టి, భగవతీం = షడ్గుణైశ్వర్యవంతురాలగు, శ్రీమాతరం = శ్రీమాతను (జగదంబను) భావయే = ధ్యానించుచున్నాను.

తా. కస్తూరీ తిలకము తోను, చంద్రకళతో నొప్పగు నొసలు గలదియు, కర్పూరాది పరిమళవస్తు మిశ్రమగు తాంబూల చర్వణగలదియు, దయావర్షమున విలసిల్లు కటాక్షప్రసారముల భక్తులకానంద మొసఁగు శ్రీశైల వాసినియైన భ్రమరాంబా తల్లిని, నా మనసులో ధ్యానించుచున్నాను.

రాజన్మత్తమరాళ మందగమనాం రాజీవ పత్రేక్షణాం
రాజీవ ప్రభవాది దేవ మకుటై రాజత్పదాంభోరుహాం
రాజీవాయత పత్రమండితకుచాం రాజాధి రాజేశ్వరీం
శ్రీశైలస్థలవాసినీం భగవతీం శ్రీమాతరం భావయే

టీక. రాజత్....గమనాం :— రాజత్ = ప్రకాశించెడి, మత్తమరాళ = మదించిన రాజహంసవలె, మందగమనాం = మెల్లనిమెలకువ నడకగల దియు, రాజీవపత్రేక్షణాం = పద్మపత్రములవలె విశాలమైనకన్నులుగల దియు, రాజీవప్రభవాది = బ్రహ్మ మొదలగు, దేవ = దేవతలయొక్క, మకుటైః = కిరీటములచే, రాజత్ పదాంభోరుహాం = ప్రకాశించు పాద పద్మములుగలదియు, రాజీవ = పద్మమువలె, ఆయత = వెడల్పయిన, పత్ర = మకరికాపత్రములతో, మండిత = అలంకరింపఁబడిన, కుచాం = స్తనద్వయముగలదియు, రాజాధి రాజేశ్వరీం = రాజాధిరాజులకుఁగూడ రాజ్ఞియైన, శ్రీశైలస్థలవాసినీం = శ్రీశైలక్షేత్రనివాసియగు, శ్రీ మాతరం = శ్రీమాతయను నామము ధరించిన, భగవతీం = సద్గుణై శ్వర్యసంపన్నయగు భ్రమరాంబికను, భావయే = నా హృదయమునఁ దలఁచుచున్నాను.

తా. రాజహంసగమనయు, పద్మపత్రాయతాక్షియు, బ్రహ్మాది దేవతలు నమస్కరింపుచుండ వారి మణికిరీటములతో నలంకరింపఁబడిన పాదపద్మములుగలదియు, మకరికాపత్రి రచనగల సరోజభాగముతో శోభిల్లుచు రాజరాజేశ్వరీ, శ్రీమాతా, భగవతీయను నామములతో నొప్పారు శ్రీశైల భ్రమరాంబ నాత్మలో ధ్యానించుచున్నాను.

శ్రీనాథాదృత పాలితత్రిభువనాం శ్రీచక్ర సంచారిణీం
గానాసక్త మనోజ్ఞ యౌవన లసద్గంధర్వకన్యాదృతాం।
దీనానామతివేల భాగ్యజననీం దివ్యాంబరాలంకృతాం
శ్రీశైలస్థలవాసినీం భగవతీం శ్రీమాతరం భావయే॥

టీక. శ్రీనాథ = విష్ణువుచే, ఆదృత = ఆదరింపఁబడి, పాలిత = పాలించిన త్రిభువనాం = ముల్లోకములుగలదియు, శ్రీచక్రసంచారిణీం = శ్రీచక్ర

మందుఁ జేయునదియు, గానాసక్త = సంగీతాసక్తిగల, మనోజ్ఞ యౌవన = మనోహరమైన తరుణవయస్సుతో. లసత్ = ప్రకాశించెడి, గంధర్వకన్యా = గంధర్వకుమారికలతో, వృతాం = చుట్టుకొనఁబడిన దియు, దీనానాం = దీనులగువారికి, అతికేల = హద్దుమీరిన, భాగ్య = సంపదను, జననీం = కల్గించునదియు, దివ్యాంబర = ప్రకాశించు వస్త్రములతో, అలంకృతాం = అలంకరింపఁబడినదియు. శ్రీశైలస్థలవాసినీం = శ్రీశైలక్షేత్రనివాసినియైన, భగవతీం = పూజ్యురాలగు, శ్రీమాతరం = శ్రీమద్భ్రమరాంబికను, భావయే = తలఁచుచున్నాను.

తా. విష్ణ్వాది దేవ జ్యేష్ఠు లాదరించురీతి లోకరక్షణ మొనర్చునదియు, శ్రీ చక్రనివాసినియై, చక్కఁగ గాన మొనర్చుచు యౌవనములోనున్న గంధర్వకన్యలతోఁ బరివేష్టింపఁబడి, దీనులకు భాగ్యము లొడఁగూర్చెడి శ్రీశైలనివాసియగు శ్రీ మాతృమూర్తిని మనసులోఁదలఁచెద.

ఉభౌ దర్వీకుంభౌ మణికనక సంభావితగుణౌ
దధానాపాణిభ్యామమృత రసమృష్టాన్నకలితౌ।
కలాఢ్యా కల్యాణీ కలితసదనా శ్రీగిరి శిర
స్యసౌ భ్రామర్యంబా రచయతు మదిష్టార్థవిభవమ్॥

టీక. మణికనకసంభావితగుణౌ = మణులతోను, బంగారముతోను తయారు గావింపఁబడిన (క్రియాన్వయము) ఉభౌ = రెండైన, దర్వీకుంభౌ = తెడ్డును, పాత్రయును, అమృతరసమృష్టాన్నకలితౌ = అమృతరసమును- (దర్వితోను) అన్నమును (పాత్రతోను) కలిగియున్నవానిని. పాణిభ్యాం = హస్తద్వంద్వముచే, దధానా = ధరించునదియు, కలాఢ్యా = సర్వకళాసంపూర్ణురాలును, కల్యాణీ = మంగళాంగియు, శ్రీగిరిశిరసి = శ్రీశైలశిఖరమున, కలితసదనా = ఆవాసమును గల్పించుకొనిన, అసౌ =

ఈ; భ్రామర్యంబా = భ్రమరాంబ, మదిష్టార్థవిభవమ్ = నాకిష్టమైన సంపదను, రచయతు = కూర్చుఁగాక!

తా. మణులతోఁ గూర్చబడిన తేడ్డు నమృతముతో నింపి యొక చేతను, బంగరుపాత్రలో నన్నమును నింపుకొని వేఱొకచేతను ధరించినదియూ, చతుష్షష్టి కళలతోఁగూడినదియు, కల్యాణగాత్రియగు శ్రీశైల భ్రమరాంబిక నాయభీష్ట భాగ్యము లొసఁగుఁగాక.



# అథ శ్రీ మల్లికార్జున ప్రపత్తిః

(టీకాతాత్పర్యసహితము)

జయజయజయ శంభో! జంభభి త్పూర్వదేవ
ప్రణత పదసరోజద్వంద్వ! నిర్ద్వంద్వ! బంధో!
జయజయజయ జన్మస్థేమ సంహారకార!
ప్రణయ సగుణమూర్తే! పాలయాస్మాన్ప్రపన్నాన్.

టీక. శంభో! = ఓ శంకర! జంభభిత్ = ఇంద్రుఁడు, పూర్వదేవ = రాక్షసులు మొదలగువారిచేత, ప్రణత = నమస్కరింపఁబడిన, పదసరోజ ద్వంద్వ = పాదపద్మములజంటగలఁవాఁడా! నిర్ద్వంద్వ = ద్వంద్వభావము లేనివాఁడా! బంధో! = ఆపద్బాంధవుఁడా! జయ, జయ, జయ! = మమ్మాటికి నీకు జయమగుఁగాక! జన్మస్థేమసంహారకార! = జన్మస్థితిలయకారకుఁడైనవాఁడా! ప్రణయసగుణమూర్తే! = భక్తియే గుణముగాఁగల మూర్తీ! జయ, జయ, జయ = మామ్మాటికి జయమునొందుము!, ప్రపన్నాన్ = నిన్ను శరణన్న, అస్మాన్ = మమ్ము, పాలయ = పరిపాలింపుము!

తా. దేవాసురులచే నమస్కరింపఁబడు పాదపద్మయుగళము గలవాఁడా! అద్వైతమూర్తి! ఆపద్బాంధవ! జన్మస్థితి లయకారక! ప్రపన్నులమగు మమ్ము పాలింపుము! నీకు జయమగుఁగాక!

వధూముఖం వల్గ దపాంగరేఖం
అఖండితానంద కరప్రసాదం,
విలోకయన్ విస్ఫురదాత్మభావ
స్సమేగతి శ్శ్రీగిరి సార్వభౌమః.

టీక. వల్గవపాంగరేఖం = ఏటవాలుగనున్న క్రీగంటి రేఖలుగలిగినట్టిదగు, వధూముఖం = తన కాంతాముఖమును, అఖండితానందకరప్రసాదం = అమితానందానుగ్రహము గలుగునట్లుగా, విలోకయన్ = చూచుచు, విస్ఫురదాత్మభావః = ప్రకాశించు నాత్మస్వరూపముగానున్న, సః = ఆ, శ్రీగిరిసార్వభౌమః = శ్రీశైలసార్వభౌముఁడైన శివుఁడు, మే = నాకు, గతిః = దిక్కగుఁగాక !

తా. క్రీఁగన్నులఁ జూచుచున్న ఆత్మకాంతాముఖము నమితానందానుగ్రహములతోఁ జూచుచు నాత్మస్వరూపియై ప్రకాశించు నా మల్లికార్జున ప్రభువునాకు గతియగుఁగాక!

కురంగ పాణిః కరుణావలోకః
సురోత్తమ శ్చంద్రకళావతంసః,
వధూసహాయ స్సకలేష్టదాతా
భవత్యసౌ శ్రీగిరి భాగ్యరాశిః.

టీక. కురంగపాణిః = లేడిని చేతియందుఁగలవాఁడును, కరుణావలోకః = దయావీక్షణములు గలవాఁడును, సురోత్తమః = దేవతలలో నుత్తముఁడును, చంద్రకళావతంసః = చంద్రకళను శిరోమణిగ ధరించినవాఁడును, వధూసహాయః = వామభాగార్ధమున నాఁడుతోఁడుగలవాఁడును, అగు, అసౌ = ఈ, శ్రీగిరిభాగ్యరాశిః = శ్రీశైలేశ్వరుఁడు, సకలేష్టదాతా = సమస్తాభీష్టము లిచ్చువాఁడు, భవతి = అగుచున్నాఁడు.

తా. దేవోత్తముఁడు నర్ధనారీ రూపుఁడగు చంద్రకళాశేఖరుడు లేడి నొకచేతధరించి దయారస మొలుకు చూపులతో నీ శ్రీశైల వాసుఁడుగా నుండెను. అట్టి యీ దేవుఁడు మాకు సకలాభీష్టము లొసఁగుఁగాక !

సంధ్యారంభ విజృంభితం శ్రుతిశిరస్థ్స్థానాంతరాధిష్ఠితం
సప్రేమ భ్రమరాభిరామ మసకృత్సద్వాసనాశోభితం,
భోగీంద్రాభరణం సమస్తసుమనః పూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితమ్.

టీక. సంధ్యారంభ = సంధ్యానటనారంభసమయమునందు, విజృంభితమ్ = ప్రకటితమైనట్టియు; శ్రుతిశిరస్థ్స్థాన = ఉపనిషత్ప్రదేశములయొక్క, అంతర = నడుమ, అధిష్ఠితం = నిండియున్నట్టియు, సప్రేమ = ప్రీతితోఁ గూడిన, భ్రమరా = భ్రమరాదేవితో, అభిరామం = మనోహరమైనట్టియు, అసకృత్ = మాటిమాటికి, సద్వాసనా = సువాసనచే, శోభితం = ప్రకాశించునట్టియు; భోగీంద్రాభరణం = సర్పరాజాభరణములు గల్గినట్టియు, సమస్తసుమనః పూజ్యం = పండితులందఱకు (ఎల్లదేవతలకు) పూజ్యం = పూజింపఁదగినట్టియు, గుణావిష్కృతమ్ = సత్త్వరజోగుణములచేఁ బ్రకటితమైనదియు, శివాలింగితం = పార్వతిచే నాలింగితమైన, శ్రీశైలమల్లికార్జున మహాలింగం = శ్రీశైలమల్లికార్జున మహాలింగమును, సేవే = సేవించుచున్నాను.

తా. సంధ్యానటన విజృంభితమును, ఉపనిషత్సంవేద్యమును, భ్రమరాంబా ప్రేమాభిశోభితమును, సగుణనిర్గుణోపేతమును, శేషాహిభూషితమును, సర్వదేవతాపూజ్యమును పార్వతీప్రియమైన శ్రీగిరి మల్లికార్జునలింగమును నేను సేవించుచున్నాను.

యామూలంనచరాచరస్య జగతః పుంసః పురాణీ సఖీ
వ్యక్తాత్మా పరిపాలనాయ జగతా మాప్తావతారావళిః,
దుష్టధ్వంస సదిష్టదానవిధయే నానాసనాధ్యాసినీ
శ్రీశైలాగ్రనివాసినీ భవతుమే శ్రేయస్కరీ భ్రామరీ.

టీక. యా = ఏదేవి, సచరాచరస్య = స్థావరజంగమాత్మకమైన, జగతః = ప్రపంచమునకు, మూలం = ప్రధానమైనదో (ప్రకృతియైనదో) పుంసః = ఆదిపురుషుఁడైన యీశ్వరునకు, పురాణీ = ప్రాచీనమైన, సఖీ = చెలికత్తియయో, వ్యక్తాత్మా = ఆకారముతోఁ బ్రకటితమైనదో, జగతాం = లోకములయొక్క, పరిపాలనాయ = రక్షణముకొఱకు, అప్తావతారస్థితిః = పొందఁబడిన జన్మలుంగలదో, దుష్టధ్వంస = దుష్టులనాశమొనర్చుట, సత్ = మంచివారలకు, ఇష్టదాన = అభీష్టములిచ్చుటయును, విధయే = పనికొఱకు, నానాసనాధ్యాసినీ = శ్రీగిరిశిఖరమున నివసించిన, భ్రామరీ = ఆ భ్రమరాంబిక, మే = నాకు, శ్రేయస్కరీ = మంగళప్రదురాలు, భవతు = అగుఁగాక !

తా. ఏదేవి చరాచరజగత్తున కంతటికి మూలప్రకృతియో, పురాణపురుషుఁడైన యీశ్వరునకే దేవి పట్టపురాణియో, లోకుల ననుగ్రహింప నేదేవి రూపమునుధరించినదో, దుష్టసంహారము, శిష్టరక్షణ మొనర్చుచు సర్వాభీష్టములను భక్తుల కనేక స్థలములనుండి యొసంగుచున్నదో ఆ శ్రీగిరి భ్రమరాంబిక నాకు శుభప్రదురాలగుఁ గాక!

యత్తేజః పరమాణురేత దఖిలం నానాస్ఫురన్నామభిః
భూతం భావి భవ చ్చరాచర జగద్ధత్తే బహిశ్చాంతరే.
సాసాక్షా ద్భ్రమరాంబికా శివసఖీ శ్రీశైలవాసోత్సుకా
దిశ్యాదాశ్రితలోక కల్పలతికా శ్రేయాంసి భూయాంసినః.

టీక. ఏతత్ = ఈ, అఖిలం = సమస్తజగత్తు. యత్తేజః పరమాణుః = ఏదేవియొక్క తేజోరూపపరమాణువో, ఏతత్ = ఈ, భూతం, భావి, భవత్ = జరిగినది (పుట్టినది) భావి = పుట్టఁబోవునది, భవత్ = జరుగుచున్న, చరాచరజగత్ = స్థావరజంగమాత్మకమగు ప్రపంచమును

నానాస్వరస్నామభిః = తేజోవంతములగు ననేక నామములతో, అంతరే = లోపలను, బహిశ్చ = వెలుపలను, ధత్తే = ఏ దేవి ధరించుచున్నదో, సా = ఆ, శివసఖీ = శివప్రియము, శ్రీశైలవాసోత్సుకా = శ్రీశైలశిఖరవాసమందు వేడ్కఁగలదియు, ఆశ్రితలోక కల్పలతికా = ఆశ్రితజనములకుఁ గల్పవృక్షమువంటిదైన, సాక్షాద్భ్రమరాంబికా = ప్రత్యక్ష భ్రమరాంబిక, నః = మాకు, భూయాంసి = అనేకములగు, శ్రేయాంసి = శుభములను, దిశ్యాత్ = ఇచ్చునుగాక!

తా. ఏ జగదంబికయొక్క తేజోవిశేషమే యీ చరాచర ప్రపంచరూపమో, భూత భవిష్య ద్వర్తమాన సర్వ ప్రపంచము నేదేవి యనేకరూప నామములతో ధరించుచున్నదో, ఆ శ్రీశైలవాసిని యగు భ్రమరాంబిక మాకు శుభము లొసఁగుఁ గాక!

శరణం తరుణేందు శేఖర శ్శరణం మే గిరిరాజ కన్యకా,
శరణం పునరేవ తా వుభౌ శరణం నాన్య దుపైమి దైవతమ్

టీక. మే = నాకు, తరుణేందుశేఖరః = బాలచంద్రశేఖరుఁడు, శరణం = రక్షకుఁడు; గిరిరాజకన్యకా = హిమవత్పుత్రియగు పార్వతి, మే = నాకు, శరణం = రక్షణము. తౌ = ఆ, ఉభౌ పునః = పార్వతీపరమేశ్వరులిద్దఱును, శరణమేవ = రక్షకులేయగుదురుగాక! అన్యత్ = ఇతరమగు, (ఈ పార్వతీపరమేశ్వరులకంటె) దైవతం = దైవమును, శరణం = రక్షణను, నోపైమి = పొందను.

తా. నాకా చంద్రకళావతంసుఁడు, శ్రీగిరి భ్రమరాంబికయు రక్షకులగుదురు గాక! ఆ యుభయమునకన్న నితరదైవ మెద్దియు నాచే శరణ మనఁబడ కుండుఁగాక!

# అథ శ్రీ మల్లికార్జున మంగళాశాసనమ్

(టీకాతాత్పర్యసహితము)

ఉమా కాంతాయ కాంతాయ, కామితార్థప్రదాయినే,
శ్రీ గిరీశాయ దేవాయ, మల్లినాథాయ మంగళం.

టీక. ఉమాకాంతాయ = పార్వతీరమణుఁడైనట్టియు, కాంతాయ = మనోహరుఁడైనట్టియు, కామితార్థ = కోర్కెలను, ప్రదాయినే = ఇచ్చువాఁడును, శ్రీ గిరీశాయ = శ్రీశైలనివాసియు, దేవాయ = దేవుఁడైన మల్లినాథాయ = మల్లికార్జునప్రభువుకొఱకు, మంగళం = శుభమగుఁగాక!

తా. ఉమాధవుఁడును, అతి మనోహరుఁడును, సర్వఫల ప్రదాతయు నగు శ్రీగిరి మల్లికార్జునస్వామికి మంగళమగుఁగాక!

సర్వ మంగళరూపాయ, శ్రీ నగేంద్ర నివాసినే,
గంగాధరాయ నాథాయ, శ్రీ గిరీశాయ మంగళం.

టీక. సర్వమంగళరూపాయ = సర్వమంగళ స్వరూపమును ధరించినట్టియు, శ్రీనగేంద్రనివాసినే = శ్రీగిరియందు నివసించియున్నట్టియు, గంగాధరాయ = గంగను ధరించినట్టియు, నాథాయ = లోకనాథుఁడైనట్టి, శ్రీగిరీశాయ = శ్రీశైలమల్లికార్జునునికొఱకు, మంగళమ్ = మంగళమగుఁగాక!

తా. సర్వమంగళరూపుఁడును, శ్రీగిరి నివాసియు, గంగాధరుఁడును, లోకనాథుఁడు నైన మల్లికార్జునుని కొఱకు మంగళమగుఁగాక!

సత్యానంద స్వరూపాయ నిత్యానంద విధాయినే,
స్తుత్యాయ శ్రుతి గమ్యాయ శ్రీ గిరీశాయ మంగళమ్.

టీక. సత్యానందస్వరూపాయ = సదానందస్వరూపుఁడును, నిత్యానంద విధాయినే = నిత్యానందమును గలుగఁజేయువాఁడును, స్తుత్యాయ = స్తోత్రముఁజేయఁదగినవాఁడును, శ్రుతిగమ్యాయ = వేదవేద్యుఁడును, (అగు) శ్రీగిరీశాయ = శ్రీగిరిమల్లికార్జునకు, మంగళం = మంగళమగుఁగాక!

తా. సచ్చిదానందరూపధారియు, జీవులకు నిత్యానందమొసఁగు వాఁడును, వేదవేద్యుఁడైన శ్రీగిరి మల్లికార్జునునకు మంగళమగుఁగాక.

ముక్తిప్రదాయ ముఖ్యాయ, భక్తానుగ్రహకారిణే,
సుందరేశాయ సౌమ్యాయ, శ్రీ గిరీశాయ మంగళమ్.

టీక. ముక్తిప్రదాయ = మోక్షము నిచ్చునట్టివాఁడును, ముఖ్యాయ = ప్రధానుడైనమైనట్టియు, భక్తానుగ్రహకారిణే = భక్తులపై దయఁగల వాఁడును, సౌమ్యాయ = శాంతిప్రదుఁడైన, శ్రీగిరీశాయ = శ్రీగిరిప్రభు వగు మల్లికార్జుననికొఱకు, మంగళమ్ = శుభముగలుగుఁగాక!

తా. మోక్షదాయకుఁడును, సర్వామరముఖ్యుఁడును, భక్తానుగ్రహప్రదుఁడును, సుందరాతి సుందరుఁడునై, శాంతిసౌఖ్యములిచ్చు శ్రీగిరీశునకు మంగళమగుఁగాక!



# అథ శ్రీశైలేశ చరణ శరణాష్టకమ్

(టీకాతాత్పర్యసహితము)

గౌరీమనోహర! సురాసుర మౌనిబృంద
సంసేవితాంఘ్రియుగ! చంద్రకళావతంస!
కైలాసవాస! కరుణాకర! భక్తబంధో
శ్రీశైలవాస! చరణం శరణం తవాస్మి.

టీక. గౌరీమనోహర! = పార్వతీదేవికిఁ బ్రియుఁడైనవాఁడా! సురాసుర మౌనిబృంద = దేవరాక్షస మునిసంఘముచే, సంసేవిత = సేవింపఁబడు చున్న, అంఘ్రియుగ! = పాదద్వంద్వముగలవాఁడా! చంద్రకళావతంస! = చంద్రకళను శిరమున కలంకారముగ ధరించినవాఁడా! కైలాసవాస! = కైలాసాచలము నివాసముగఁ గలవాఁడా! కరుణాకర! = దయకాకరమైనవాఁడా! భక్తబంధో! = భక్తులపాలిటియాప్త బంధువా! శ్రీశైలవాస = శ్రీగిరివాస, తవ = నీయొక్క, చరణం = పాదములను, శరణం = రక్షణమును, అస్మి = అంటిని.

తా. ఓ శ్రీశైలవాస! 'గౌరీమనోహర' అను నాలు నామములతోఁ గూడిన నీచరణమునే నేను శరణమంటిని.

భక్తార్తిహార! భవబంధ వినాశకేశ!
దివ్యాపగాకలిత కాంత జటాకలాప!
శేషాహిభూష! వృషవాహన! వ్యోమకేశ!
శ్రీశైలనాథ! చరణం శరణం తవాస్మి.

టీక. భక్త = భక్తులయొక్క, ఆర్తి = బాధను, హార! = హరించువాఁడా! భవబంధ = సంసారబంధమును, వినాశక! = నశింపఁజేయువాఁడా!, ఈశ! = లోకముల శాసించువాఁడా!, దివ్యాపగా = దేవగంగతో,

కలిత = కూడి, కాంత = మనోహరమైన; జటాకలాప! = జడల సమూహముగలవాఁడా! శేషాహి = శేషుఁడనుసర్పరాజు, భూష! = అలంకారముగాఁ గలవాఁడా, వృషవాహన! = వృషభమును వాహనముగాఁ గలవాఁడా! వ్యోమకేశ! = ఆకాశమునంటిన కేశములుగలవాఁడా!, శ్రీశైలనాథ! = శ్రీగిరివాస!, తవ = నీయొక్క, చరణం = పాదమును శరణం = రక్షణమునుగ, అస్మి = అంటిని.

తా. ఓ శ్రీశైలనాథ! 'భక్తార్తిహర' అనునామము నుండి సప్తనామములతో నిన్నాహ్వానించి నీ పాదమును శరణమంటిని.

"భృంగీశ సేవిత ! గణేశ కుమార తాత !
మృత్యుంజయ ! త్రిపురదానవభేదకారిన్ !
పాణౌవుపాత్త మృగ డామరుక త్రిశూల !
శ్రీశైలవాస ! చరణం శరణం తవాస్మి".

టీక. భృంగీశసేవిత = భృంగీశునిచే (ప్రమథాధిపుఁడు) సేవింపఁబడువాఁడా!; గణేశకుమారతాత = గణపతి, కుమారులు పుత్త్రులుగాఁ గలవాఁడా!, మృత్యుంజయ! = మృత్యువును జయించినవాఁడా!, త్రిపురదానవ = త్రిపురాసురులను, భేదకారిన్ = భేదించినవాఁడా! పాణౌ = చేతియందు, ఉపాత్త = పొందిన, మృగ = లేడియు, డామరుక = డమరుకము (బుడబుక్కలవారువాయించుసాధనము) త్రిశూల = త్రిశూలమును గలవాఁడా! శ్రీశైలవాస! శ్రీగిరినిలయుఁడా! తవ = నీయొక్క, శరణం = పాదమును, శరణం = రక్షకమునుగ, అస్మి = అయియుంటిని.

తా. ఓ! శ్రీశైలవాస! 'భృంగీశసేవిత' అను నైదు నామములతో నిన్నుఁ బిల్చి నీ పాదమును శరణ మంటిని.

"నాగేంద్ర చర్మవస ! నాగ్ని రవీందునేత్ర !
నారాయణీప్రియ ! మహేశ ! నగేశ ! శంభో !
మౌనిప్రి ! యాశ్రితమహాఫల ! దోగ్రరూప !
శ్రీశైలనాథ ! చరణం శరణం తవాస్మి".

టీక. నాగేంద్ర = గజేంద్రునియొక్క, చర్మ = చర్మమును, వసన = వస్త్రముగఁ గలవాఁడా! అగ్ని, రవి, ఇందు నేత్ర! = అగ్ని, సూర్యుడు, చంద్రుఁడు నను మూఁడు నేత్రములు గధరించినవాఁడా! నారాయణీ = నారాయణియను శక్తికి (వైష్ణవమాయకు) ప్రియ = ప్రియమైనవాఁడా!, మహేశ = మహాప్రభూ!, నగేశ = కైలాసాధీశ్వరుఁడా!, శంభో = సుఖమును గల్గించువాఁడా! మౌనిప్రియ! = మహర్షులకుఁ బ్రియమైన వాఁడా! ఆశ్రితమహాఫలద! = ఆశ్రయించినవారికిఁ బరమపురుషార్థ సాధనమునిచ్చువాఁడా!, (జ్ఞానమ్మహేశ్వరాదిచ్ఛేత్ - అని శాస్త్రము) ఉగ్రరూప! = ఉగ్రుఁడను రూపముతో నున్నవాఁడా!, శ్రీశైలనాథ = శ్రీగిరి ప్రభూ! తవ = నీయొక్క, చరణం = పాదమును, శరణం = రక్షణమును, అస్మి = అయియుంటిని.

తా. ఓయీ! శ్రీశైలప్రభూ ! 'నాగేంద్రచర్మవసన' అను నవ నామములతో నిన్నుఁ బిలిచి నీ పాదములను శరణమంటిని.

సర్వార్తిభంజన ! సదాశివ ! దానవారే !
పార్థప్రహార కలితోత్తమ మూర్ధభాగ !
యక్షేశసేవితపదాబ్జ ! విభూతి దాయిన్ !
శ్రీశైలవాస ! చరణం శరణం తవాస్మి.

టీక. సర్వ = సమస్తమైన, ఆర్తి = ఆపదలను, భంజన = విధ్వంసమొనర్చు వాఁడా ! సదాశివ ! = ఎల్లప్పుడు మంగళముతో నుండువాఁడా !,

దానవ = రాక్షసులకు, అరే = శత్రువైనవాఁడా! పార్థ = అర్జునుని యొక్క, ప్రహార = దెబ్బతో, కలిత = కూడిన, మూర్ధభాగ = శిరోభాగముఁ గలవాఁడా!, యక్షేశ = కుబేరునిచే, సేవిత = సేవింపఁబడిన పదాబ్జ = పాదపద్మములు గలవాఁడా! విభూతిదాయిన్! = ఐశ్వర్యమును నొసంగువాఁడా!, శ్రీశైలవాస! = శ్రీగిరివాస, తవ = నీయొక్క, చరణం = పాదమును, శరణం = రక్షణముగ, అస్మి = అంటిని.

తా. ఓ! శ్రీశైలవాస! 'సర్వార్తిభంజన' అను నాలు పేరులతో నిన్నుఁ బిలిచి నీ పాదమును శరణ మంటిని.

శ్రీ భ్రామరీశ ! మదనాంతక ! కృత్తివాస !
స్సర్పాస్థిరుండ కలి తామల హారధారిన్ ।
భూతేశ ! ఖండపరశో ! భవబంధనాశ !
శ్రీశైలనాథ ! చరణం శరణం తవాస్మి.

టీక. శ్రీ భ్రామరీశ! = శుభములిచ్చు భ్రమరాంబికానాథుఁడా!, మదనాంతక! = మన్మథుని నాశన మొనర్చినవాఁడా!, కృత్తివాసః = గజేంద్ర చర్మమును వస్త్రముగఁ గలవాఁడ!, సర్ప = పాములు, అస్థి = ఎముకలు రుండ = తలపుఱ్ఱెలతో, కలిత = కూడిన, అమల = స్వచ్ఛమైన హార = హారమును, ధారిన్ = ధరించినవాఁడా! భూతేశ! = భూతములకధిపతియైనవాఁడా!, ఖండపరశో! = ఖండించెడి గొడ్డలికలవాడా (పరశువను రాక్షసుని ఖండించినవాఁడా) భవబంధనాశ! = సంసృతిబంధమును దెగఁగొట్టువాఁడా!, శ్రీశైలనాథ = శ్రీగిరివాస!, తవ = నీయొక్క చరణం = పాదములను, శరణం = రక్షకముగ, అస్మి = అయితిని.

తా. ఓ! శ్రీశైలప్రభూ! 'శ్రీభ్రామరీశ' అనునది మొదలీపైఁబడిన యేడు నామములతో నిన్నుఁ బిలచి నీ పాదమును శరణ మనుచున్నాను.

సర్వాగమస్తుత ! పవిత్ర చరిత్ర ! నాథ !
యజ్ఞప్రియ ! ప్రణతదేవ గణోత్తమాంగ !
కల్పద్రుమ ప్రసవ పూజిత దివ్యపాద !
శ్రీశైలవాస ! చరణం శరణం తవాస్మి.

టీక. సర్వ = సమస్తమైన, ఆగమ = స్మృతులచే, స్తుత! = కొనియాడఁబడినవాఁడా !, పవిత్రచరిత్ర = పవిత్రమగు చరిత్రగలవాఁడా !, నాథ! = ఓ! ప్రభూ!, యజ్ఞప్రియ! = యజ్ఞములపైఁ బ్రీతిఁగలవాఁడా!, ప్రణత = నమస్కరించెడు, దేవగణ = దేవతాసమూహము యొక్క, ఉత్తమాంగ! = శిరస్సులుగలవాఁడా; కల్పద్రుమ = కల్పవృక్షముల యొక్క, ప్రసవ = పూలచే, పూజిత = పూజింపఁబడిన, దివ్యపాద = ప్రకాశించు పాదములు గలవాఁడా!, శ్రీశైలవాస! శ్రీగిరిపర్వతావాసము గలవాఁడా, శంకరా! తవ = నీయొక్క, చరణం = పాదమును, శరణం = రక్షకముగ, అస్మి = అయితిని.

తా. ఓ శ్రీశైల పర్వతమందు నివసించు స్వామి! 'సర్వాగమస్తుత' అను నామము మొదలాగు నామములతో నిన్నుఁ బిల్చి నీ పాదమును శరణ మంటిని.

శంభో ! గిరీశ ! హర ! శూలధ ! రాంధకారే !
శ్రీశైలవాస ! భ్రమరాంబికయా సమేత !
శ్రీ పార్వతీ దయిత ! సాక్షిగణాధిపేడ్య !
శ్రీశైలనాథ ! చరణం శరణం తవాస్మి.

టీక. శంభో! = సుఖమునుగల్గించువాఁడా!, గిరీశ! = కైలాసపర్వతమునకు ప్రభువా? (లేక -పర్వతములపైననే తన నివాసముండుటనుబట్టి పర్వతములకుఁ బ్రభువా! యనియునర్థము) హర! = కష్టములనుహరించువాఁడా!

శూలధర! = త్రిశూలమును ధరించినవాఁడా!, అంధకారే! = అంధకుఁ డను రాక్షసునకు శత్రువైనవాఁడా!, శ్రీశైలవాస! = శ్రీగిరియందు వసించువాఁడా! భ్రమరాంబికయా = భ్రమరాంబాదేవితో, సమేత! = కూడినవాఁడా!, శ్రీ = శోభావతియగు, పార్వతీ = పర్వతరాజపుత్రిక, దయిత! = ప్రియురాలుగాఁ గలవాఁడా! సాక్షిగణాధిప! = సాక్షిగణ పతిచే, ఈడ్య! = నుతింపఁబడువాఁడా! శ్రీశైలనాథ! = శ్రీశైలప్రభూ! తవ = నీయొక్క, చరణం = పాదమును, శరణం = రక్షకముగ, అస్మి = అయితిని.

తా. ఓ! శ్రీశైలేశ్వర! 'శంభో' అనునది మొదలు తొమ్మిది నామములతో నిన్నుఁ బిలిచికొని నీ పాదమే నాకు శరణ మని యనుచుంటిని; రక్షింపుమని భావము.



శ్రీశైలం, శిఖరేశ్వరం, గణపతిం, శ్రీహాటకేశంపున
స్సారంగేశ్వర, బిందుతీర్థ మమలం ఘంటార్క సిద్ధేశ్వరం।
గంగాం శ్రీ భ్రమరాంబికాం గిరిసుతా మారామ వీరేశ్వరం
శంఖంచక్ర వరాహతీర్థ కలితం శ్రీశైలనాథంభజే.

టీక. శ్రీశైలం = శ్రీగిరి, శిఖరేశ్వరం = శిఖరేశ్వరుని, గణపతిం = సాక్షి గణపతిని, శ్రీహాటకేశం = శోభించుహాటకేశ్వరుని (అటికేశ్వరుని) పునః = ఇంకను, సారంగేశ్వర = సారంగతీర్థమును, అమలం = స్వచ్ఛమైన, బిందుతీర్థం = బిందుతీర్థమును, ఘంట = ఘంటేశుని, అర్క = అర్కేశ్వరుని, సిద్ధేశ్వరం = సిద్ధేశుని, గంగాం = పాతాళగంగను, శ్రీ భ్రమరాంబికాం = శ్రీ భ్రమరాంబాదేవిని, గిరిసుతాం = పార్వతీదేవిని, ఆరామ వీరేశ్వరం = ఆరామవీరేశ్వరుని, శంఖం = శంఖమనుతీర్థమును. చక్రవరాహతీర్థ = చక్రతీర్థ, వరాహతీర్థములతో, కలితం = కూడిన, శ్రీశైలనాథం = శ్రీశైలేశుఁడగు మల్లికార్జునస్వామిని, భజే = సేవించుచున్నాను.

తా. శ్రీశైల క్షేత్రతీర్థములఁ గల ఈపైఁ జూపఁబడిన పదునాఱు క్షేత్రతీర్థములతోఁగూడిన శ్రీశైల వాసుని నిత్యము మనసులోఁ దలఁచు చున్నాను. అని, కవి శ్రీశైలక్షేత్రాదిస్మరణము కాశీస్మరణము వలె పాపహారమని నుడువు చున్నాఁడు.

శ్రీశైలేశ్వర సుప్రభాత కలిత గ్రంథస్య, లంకాన్వయ
స్సీతారామకవి, ర్యథామతి, ముదా, భావార్థవైశద్యయు
గ్వ్యాఖ్యానం, విరచయ్య, చాంతిమతదే తస్యానుకంపాప్తయే
హ్యేకం, శ్రీచరణద్వయం, శరణమి, త్యాలోచ్య, తేనేఽష్టకమ్

టీక. శ్రీశైలేశ్వరసుప్రభాత = శ్రీగిరీశుని సుప్రభాతముతో, కలిత = కూడిన, గ్రంథస్య = గ్రంథమునకు, లంకాన్వయః = లంకావంశసంభూతుఁడగు, సీతారామకవిః = కవియగుసీతారామశాస్త్రి, ముదా = సంతోషముతో, యథామతి = బుద్ధివైశద్యముకొలఁది, భావార్థవైశద్యయుక్ = భావము, అర్థములయొక్క విశదీకరణముతోఁకూడిన, వ్యాఖ్యానం = విపులీకరణమును, విరచయ్య—రచించి, అంతిమపదే = ఈసుప్రభాత గ్రంథాంతిమస్థానమును, (గ్రంథముయొక్క చివర) తస్య = ఆ శ్రీశైలేశునియొక్క, అనుకంపా = దయను, ఆప్తయే = పొందుటకొఱకు ఏకం = ముఖ్యమైనది, శ్రీచరణం = శ్రీవారిపాదమే, శరణంహి = రక్షకముగదా! ఇతి = ఇట్లని, ఆలోచ్య = తలఁచి, అష్టకం = శ్రీశైలవాస చరణశరణాష్టకమును, తేనే = రచించెను. (తనూకరణ ఇతిధాతోర్లిటి ఉత్తమ పురుషైకవచనమ్)

తా. 'లంకా సీతారామశాస్త్రి' యను కవి యీ శ్రీశైల సుప్రభాత గ్రంథమునకు టీకాతాత్పర్యములను వ్రాసి, యీ గ్రంథాంతమందు శ్రీశైలచరణ శరణాష్టక ముండుటావశ్యక మనియు—సర్వులకా శ్రీశునిచరణమే శరణమని యెంచి దానివి రచించి ధన్యుఁడయ్యెనని తాత్పర్యము.

సర్వేజనా స్సుఖినోభవంతు

ఓం

తత్సత్

